# ప్రశ్న

జ్యోతిషశాస్త్రము సిద్ధాంత, హోరా, సంహిత, ప్రశ్న, శకునము అను పంచస్కంధాత్మకముగా వివరించబడినది. ఒక వ్యక్తి ప్రశ్నించు సమయానికిగల గ్రహములస్థితి ఆ ప్రశ్న గురించిన వివరములు మరియు ఆ ప్రశ్న యొక్క భవిష్యత్తు తెలుపగలవు అనే ప్రాతిపదికతో ప్రశ్నాశాస్త్రం వృద్ధి చెందినది.

జన్మ జాతకము ఉన్నపుడు ప్రశ్న ఎందుకు అనే సంశయం కలుగుతుంది. కొన్ని సమయాలలో వ్యక్తి కి కలుగు సందేహాలు జాతక చక్రము ద్వారా నివృత్తి చేయుట చాలా కష్టము. అట్టి సమయాలలో ప్రశ్న చాలా ఉపయోగ పడుతుంది.

జన్మ జాతకం పూర్వజన్మలో చేసిన కర్మల ఫలితాలను తెలుపును. ప్రశ్న జాతకం ఈ జన్మలో ప్రశ్నా సమయం వరకు వ్యక్తి చేసిన కర్మల ఫలితాలను తెలుపుతుంది. అనగా ఈ జన్మలో వ్యక్తి చేసిన కర్మల వలన మార్పు చెందిన ప్రారబ్ధ కర్మను ప్రశ్న చక్రము తెలుపుతుంది. కావున జన్మ చక్రములోని యోగము ప్రశ్న చక్రములో ఉండవచ్చును, లేకపోవచ్చును.

**ప్రశ్న ప్రాముఖ్యత:**

జాతకములోని ఒక అంశము యొక్క సూక్ష్మకాల నిర్ణయము ప్రశ్నద్వారా మాత్రమే సాధ్య పడుతుంది.

రెండు అంశాలలో దేనిని ఎన్నుకోవాలి అనే సంశయం కలిగినపుడు ప్రశ్న ఉపయోగపడుతుంది. ఉదాహరణకు, రెండు ఉద్యోగాలలో ఒకదానిని ఎంచుకోవడం, వివాహ సంబంధాల విషయంలో రెండు మూడు జాతకాలు అనుకూలంగా ఉన్నపుడు ఒకదానిని ఎంచుకోవడం మొదలైనవి.

జననకాల సమయము తెలియనివారు, జన్మ జాతకం లేనివారు అడిగే సందేహాలు ప్రశ్న ద్వారా మాత్రమే తీర్చవచ్చును.

ఒక వ్యక్తికి అనారోగ్యంగా ఉన్నపుడు ఏరకమైన వైద్య విధానం సరిపడుతుంది? ప్రస్తుత వైద్యుడు ఉపకరిస్తాడా లేక వైద్యుని మార్చాలా మొదలైన సందేహాలకు ప్రశ్న ద్వారానే జవాబు చెప్పగలరు.

ఇంట్లోని వస్తువులు దొంగిలించబడినపుడు ఆ వస్తువులు తిరిగి లభిస్తాయా లేదా? తప్పిపోయిన లేక పారిపోయిన లేక దేశాంతరం వెళ్ళిన వ్యక్తి వస్తాడా? వస్తే ఎప్పుడు వస్తాడు? అనే అంశాలు ప్రశ్న ద్వారా మాత్రమే చెప్పవచ్చును.

**పృచ్ఛక లక్షణములుః**

శుభ తిథి, శుభమైన అనుకూలమైన నక్షత్రం, శుభ గోచారం రోజున పండ్లు మరియు యితర బహుమతులతో దైవజ్ఞుని సంతృప్తి పరచి ఉదయకాలంలో అతని వద్దకు వెళ్ళి అవసరమైన ప్రశ్న అడగాలి. దైవజ్ఞుని పరీక్షించడానికి ప్రశ్నించరాదు. వినయ విధేయతలతో స్పష్టమైన వాక్కుతో ప్రశ్నించవలెను.

**చంద్రుడు లగ్నములో, శని కేంద్రములో మరియు బుధుడు అస్తంగత్వము చెందియున్న**

**లేక**

**లగ్నములోని చంద్రునిపై బుధ కుజుల దృష్టివున్న**

ప్రృచ్ఛకుడు ప్రశ్నించు విధానము మంచిదికాదు అని అర్థము. అనగా పృచ్ఛకునిలో నిజాయితీలోపమును సూచించును.

**ప్రశ్న సమయముః**

ఈ క్రింది సమయాలలో దైవజ్ఞుని ప్రశ్నించకపోవడం శ్రేయస్కరం.

నక్షత్రాలుః భరణి, కృత్తిక, ఆర్ద్ర, ఆశ్లేష, మఖ, విశాఖ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, పూర్వాభాద్ర మరియు గండాంత నక్షత్రాలు (ఆశ్లేష, జ్యేష్ట, రేవతి చివరి పాదాలు. అశ్వని, మఖ, మూల మొదటి పాదాలు)

తిథులుః అష్టమి, భద్ర ( విదియ, సప్తమి, ద్వాదశి), రిక్త (చవితి, నవమి, చతుర్దశి) మరియు అమావాస్యతిథులు.

యోగములుః వ్యతీపాత, వైధృతి మొదలైన అశుభ యోగాలు

కరణములుః స్థిర కరణములు (శకుని, చతుష్పాద, నాగ, కింస్తుఘ్న)

వారములుః మంగళ శనివారములు

సూర్య చంద్ర గ్రహణములలో మూడు రోజులు, మధ్యరాత్రి, ఉత్పాతాలతో కూడిన సమయం, గుళిక లగ్నంలో వున్నపుడు, లగ్నం పై పాపగ్రహ దృష్టి ఉన్న సమయంలో రవి సరిగా కనిపించని సమయాల్లో, సంక్రమణ దినములలో, భూకంప, ఉల్కాపాత ధూమకేతు ఉదయం మొదలైన సమయాలలో ప్రశ్నించరాదు.

పై సమయాలు పృచ్ఛకుని కంటే దైవజ్ఞునికే గుర్తించే అవకాశాలెక్కువ కాబట్టి జ్యోతిష్కుడు ఆసమయాలలో ప్రశ్న ఫలితం చెప్పరాదు.

కొందరు కొన్ని విచిత్రమైన సందేహాలు అడుగుతారు. వాటిని ఆ వ్యక్తి జాతక చక్రము ద్వారా చెప్పుట అసాధ్యము. ఊదాహరణకి, దూరపు బంధువు లేక మిత్రుని లేక మిత్రుని బంధువు గురించిన వివరములు ప్రశ్న ద్వారా మాత్రమే చెప్పగలరు. ఎన్నికలలో ఫలానా పార్టీ గెలుస్తుందా లేక ఒడిపోతుందా? అనే ప్రశ్నకు ప్రశ్నాశాస్త్రం ద్వారానే జవాబు చెప్పగలరు. ప్రశ్నించే వ్యక్తిని పృచ్ఛ్కడు, ప్రశ్నకు జవాబిచ్చే వ్యక్తిని దైవజ్ఞుడు అని అందురు.

**దైవజ్ఞ లక్షణాలుః**

గణితేషు ప్రవీణోయః శబ్ద శాస్త్రే కృత శ్రమః
న్యాయవిద్ బుద్ధిమాన్ దేశదిక్కాలజ్ఞో జితేంద్రియః
త్రిస్కంధజ్ఞో దర్శనీయః శ్రౌత స్మార్త క్రియాపరః
నిర్దాంభికః సత్యవాదీ దైవజ్ఞో దైవవిత్ స్థిరః
అద్వేషీ నిత్య సంతోషీ గణితాగమ పారగః
ముహూర్త గుణదోషజ్ఞో వాగ్మీ కుశల బుద్ధిమాన్

దైవజ్ఞుడు గణితశాస్త్రంలో ప్రవీణుడు, శబ్ద శాస్త్రంలో కృషిచేసి అధికారం పొందినవాడు, న్యాయవిదుడు, దిక్కు, దేశం, కాలజ్ఞానం కలిగినవాడు, ఇంద్రియ నిగ్రహం కలిగినవాడు అయి ఉండాలి.

సిద్ధాంత, సంహిత, హోర అనే మూడు స్కంధాల పరిజ్ఞానం కలవాడు, శ్రౌత స్మార్త కర్మలు తెలిసినవాడు, దంభం లేనివాడు, ఎప్పుడూ సత్యాన్నే మాట్లాడేవాడు దైవజ్ఞుడు.

ద్వేషం లేనివాడు, ఎల్లపుడు సంతోషంగా ఉండేవాడు, గణిత శాస్త్రం తెలిసినవాడు, ముహూర్తంలోని గుణదోషాలు తెలిసిన వాడు అయివుండాలి.

**దైవజ్ఞ కర్తవ్యాలుః**

బ్రాహ్మీ ముహూర్తంలోనే నిద్రలేచి ఇష్టదైవాన్ని ధ్యానించి, శరీర శౌచ క్రియలు నిర్వహించి, దంతధావన, స్నానం, ఆచమన, అర్ఘ్య దానాదులు, మంత్ర జపాది నిత్య నైమిత్తిక కర్మలను చేసి, స్వస్థమైన ప్రశాంతమైన మనస్సుతో పంచాంగాన్ని చూసి గ్రహాల గణనను దైవజ్ఞుడు చేయవలెను.

ఎవరైనా అపరిచిత వ్యక్తులు ప్రశ్న అడగటానికి వచ్చినపుడు వారిపై సావధానంగా పూర్ణ దృష్టిని కేంద్రీకరించి , వారి శరీరాంగాలను వారు స్పృశించుకునే విధానము, యితర చేష్టలు ప్రశ్నాసమయంలో కనిపించే శకునాలు, తత్కాల గ్రహస్థితి మొదలైన అన్ని అంశాలను, తన శ్వాసను గమనించి ఫలితం చెప్పాలి. ప్రశ్నించని వానికి ఫలాదేశం చెప్పకూడదు.

## ప్రశ్న ప్రదేశం ః

ఫలపుష్పాదులతో కూడిన వృక్షాలు ఉన్న సమతలమైన ప్రదేశం, ఇంద్రయాలు మనస్సునకు ఆహ్లాదము కలిగించు ప్రదేశంలో, మంగళ కార్యాలు జరిగే ప్రదేశంలో, సౌభాగ్యవతులంతా తిరిగే ప్రదేశంలో, పుత్రులు స్త్రీలు బంధువులున్న గృహంలో ప్రశ్నిస్తే అభీష్టప్రాప్తి జరుగుతుంది.

అడవులలో, శ్మశానప్రదేశాలలో, ఎత్తు పల్లాలున్న ప్రదేశంలో, ఎవ్వరూ తిరుగని ఏకాంత ప్రదేశాలలో, దుఃఖితులైన జనులున్న గృహాలలో, ప్రేతాది అశుభ కర్మలు జరిగే ప్రదేశాలలో, నీరు, అగ్ని, ఎండిన వృక్షాల దగ్గర, ఇంద్రియాలకు దుఃఖం మరియు కష్టం కలిగించే ప్రదేశాలలో ప్రశ్నించరాదు.

## ప్రశ్న ఫలించు సమయం ః

నవాంశ లగ్నాధిపతి ప్రశ్న ఫలించు సమయాన్ని సూచిస్తాడు.

| | |
|---|---|
| రవి అయితే | 1 ఆయనం (6 నెలలు) |
| చంద్రుడు | 1 క్షణం |
| కుజుడు | 1 రోజు |
| బుధుడు | 1 ఋతువు ( రెండు నెలలు) |
| గురుడు | 1 నెల |
| శుక్రుడు | 1 పక్షం |
| శని | 1 సంవత్సరం |

## ప్రశ్నపద్ధతులుః

| APSRTC | | KK GAS | | VKAP | |
|---|---|---|---|---|---|
| A | - అంజన | R | - రమల | | |
| p | - ఫలపుష్ప | T | - తాంబూల | | |
| S | - స్వర | C | - చేష్టా | | |
| K | - కుండలిని | K | - కాల | | |
| G | - గవ్వల | A | - అక్షర | S | - సంఖ్యా |
| V | - వ్యాక్య ప్రశ్న | K | - కేరళ ప్రశ్న / అష్ట మంగళ ప్రశ్న | | |
| A | - ఆరూఢ ప్రశ్న | P | - పంచపక్షి | | |

**ప్రశ్న ఫలించు యోగములుః**

పృష్ఠోదయరాశి - మేషం, వృషభం, కర్కాటకం, ధనస్సు మకరం

శీర్షోదయరాశి - మిధునం, సింహ, కన్య, తుల, వృశ్చిక, కుంభ

ఉభయోదయరాశి - మీనం

శీర్షోదయరాశి ప్రశ్న లగ్నమైతే శుభం. పృష్ఠోదయరాశులు ప్రశ్నాలగ్నమైతే ప్రశ్న ఫలించదు. ఉభయోదయరాశి లగ్నమైతే మధ్యమం

చరరాశులు లగ్నమైతే ప్రస్తుత పగిస్థితులలో మార్పు కనపడుతుంది. స్థిరరాశులు లగ్నమైతే మార్పు వుండదు. ద్విస్వభావరాశులు లగ్నమైతే ఆలస్యం, కష్టంతో ఫలితం కనిపిస్తుంది. చరరాశి వైపు, చరరాశి ఫలితాలు, స్థిరరాశి వైపు వుంటే స్థిరరాశి ఫలితాలు వుంటాయి.

లగ్నేషుడికి, కార్యేశుడికి సంబంధం వుండాలి. లగ్నేషుడికి, కార్యేశుడికి సంబంధం వుంటే ప్రశ్న ఫలిస్తుంది.

లగ్నేశుడికి, కార్యేశుడికి శుభ, తాజిక యోగం వుంటే ప్రశ్న ఫలిస్తుంది

లగ్నాధిపతి, చంద్రుడు శుభభావాలలో వుండాలి. కేంద్రాలలో శుభ గ్రహాలు, త్రిష్ఠాయాలలో పాపగ్రహాలుండాలి.

ఉపచయాల్లోచంద్రుడు వుంటే మంచిది.

ప్రశ్నాచక్ర లగ్నం, జన్మలగ్నం ఒకదాని కొకటి శుభ భావాలలో ఉండాలి.

ద్వి, ద్వాదశాలు, షష్టకాలలో పడకూడదు.

**ప్రశ్నా చక్రంలో వక్రగ్రహాల ప్రభావం :**

ప్రశ్నా చక్రంలో వక్ర గ్రహం ఏ భావంలో కలదో ఆ భావానికి సంబంధించిన అంశములలో అడ్డంకులు కలుగుతూ వుంటాయి

శుభగ్రహాలు వక్రించి శుభ భావాలకు అధిపతి అయితే మంచి జరగడానికి చేసే కృషి పునరావృతమవుతుంది

వక్రించిన పాపగ్రహం శుభ భావాలకు అధిపతి అయితే ప్రశ్న ఫలించడానికి ముందు అడ్డంకులు, మానసిక వ్యధ కలుగుతాయి.

వక్రించిన శుభగ్రహాలు 6, 8, 12 భావాలకు అధిపతులైతే శుభఫలితం రావడం కష్టం

పాపగ్రహాలు వక్రించి 6, 8, 12 భావాలకు అధిపతులయితే చేసిన పని మళ్ళీ, మళ్ళీ చేయడం, అడ్డంకులు ఎదుర్కొనడం, అయినప్పటికి ఫలితం రాదు

## వివాహప్రశ్న:

లగ్నాధిపతికి, సప్తమాధిపతికి సంబంధం వుంటే వివాహం జరుగుతుంది. ఆ Particular సంబంధం కుదురుతుంది.

శుక్రుడు లేక లగ్నాధిపతి లేక సప్తమాధిపతి ఉచ్ఛలో ఉండి లగ్నంతో కాని సప్తమంతో కాని సంబంధం వుంటే timely marriage

శుక్రుడు, మరియు శుక్ర రాశ్యాధిపతి ఇద్దరు ఉపచయాస్థానాల్లో వుంటే సుఖమైన వైవాహిక జీవితం

చంద్రుడు 7, 2 ఉపచయ భావాలలో వుండి గురుని చేత చూడబడినచో త్వరలో వివాహం జరుగును. పై విధముగ నున్న చంద్రుడు పాప గ్రహములచేత చూడబడినచో వివాహం జరుగదు.

ప్రశ్నాచక్రంలో చంద్రుడు 1, 5, 9( కోణాలు) 4, 8, 12 (కంటకములు) ఉండి పాపగ్రహములచేత చూడబడినచో వధువు లేక పరుడు లభించుటలో అడ్డంకులు ఏర్పడును

ప్రశ్నాచక్రంలో లగ్నాధిపతి కాని చంద్రుడు కాని సప్తమంలో వున్న లేక సప్తమాధిపతి లగ్నంలో వున్న ఎక్కువ శ్రమ లేకుండా వధువు లేక వరుడు లభించును

వాక్ స్థానాధిపతితో 9, 4, 3, 11 అధిపతులకు సంబంధం వుంటే ఆ గ్రహ సంబంధిత బుధువుల ద్వారా వ్యవహారం సానుకూలమగును

అష్టమాధిపతి అష్టము, వివాహం జరుగుటలో అడ్డంకులను సూచిస్తాయి. అష్టమాధిపతి సప్తమంలో వున్న, సప్తమాధిపతితో కలసియున్న వివాహ కారకుడైన శుక్రునితో కలసియున్న నిర్ణయించిన వివాహం ఆగిపోతుంది

షష్టాధిపతి సప్తమంలో వున్న, సప్తమాధిపతితో కలసివున్నా శుక్రునితో కలసివున్న శుక్రునితో కలసివున్న పెళ్ళి సమయమందు ముఖ్యులకు అనారోగ్యం, ఘర్షణలు రావచ్చును

సప్తమాధిపతి / శుక్రుడు ఉపచయస్థానాల్లో (3 / 6 / 10 / 11) వుంటే దాంపత్యం బాగుంటుంది

## ప్రేమవివాహం :

ప్రశ్నాచక్రంలో లగ్నధిపతి, సప్తమాధిపతి పరివర్తన

లగ్నాధిపతి, వ్యయాధిపతి పరివర్తన

శుక్రచంద్రులు, ఉచ్ఛలో గాని, సొంతరాశులలో గాని వున్నా

పంచమాధిపతికి, సప్తమాధిపతికి సంబంధం వున్నా వాటి మధ్య శుభతాజక సంబంధం వున్న ప్రేమవివాహం జరుగుతుంది

లగ్నాధిపతికి, పంచమాధిపతికి సంబంధముంటే విషయం ప్రేమతో ఆగిపోతుంది. సప్తమాధిపతితో సంబంధముంటే వివాహానికి దారితీస్తుంది.

**అన్యోన్య దాంపత్యం :**

లగ్నాధిపతికి, సప్తమాధిపతికి శుభసంబంధముండాలి

**ఆలస్యవివాహం :**

అష్టమ మందు పాపగ్రహముంటే ఆలస్య వివాహం

అష్టమాధిపతికి, లగ్నాధిపతితో కాని, సప్తమాధిపతితో కాని సంబంధముంటే ఆలస్య వివాహం

**వివాహం కాకపోవటం :**

శుక్రుడు లేక చంద్రుడు 6 కాని 8 వ ఇంటిలో వుంటే వివాహం జరుగదు.

**విడాకులు:**

శుక్రుడి నుండి సప్తమం లో కుజుడు కాని శని కాని వుంటే విడాకులు

సప్తమ భావానికి కుజ సంబంధమున్నా,

సప్తమభావానికి, షష్ట భావానికి సంబంధమున్నా,

లగ్న సప్తమాల్లో రాహుకేతులుండి, సప్తమాధిపతి వ్యయలో కాని, వ్యయాధిపతి సప్తమంలో వున్నా,

సప్తమంలో పాపగ్రహముల చేత ప్రభావితుడైన రవి వున్నా విడాకులు

0 0 0

## సంతానప్రశ్నః

ప్రశ్నా చక్రంలో లగ్నాధిపతి కాని చంద్రుడు కాని పంచమంలో వుండటం

పంచమాధిపతి లగ్నంలో వున్నా

పంచమాధిపతికి, లగ్నాధిపతితో కాని, చంద్రునితో కాని సంబంధం వున్నా సంతానయోగం వుంటుంది

పంచమంకు కాని, పంచమాధిపతికి కాని గురు సంబంధముంటే సంతానయోగం కలదు

పురుషులకు, లగ్నధిపతి మరియు లగ్నాధిపతి నుండి పంచమాధిపతి అస్తంగతులైన పురుషుని యందు లోపమని చెప్పవలెను

ఆరూఢ లగ్నాధిపతి, ఆరూఢలగ్నాధిపతి నుండి భాగ్యాధిపతి అస్తంగతులైన స్త్రీ యందు లోపమని చెప్పవలెను

ప్రశ్నా సమయంలో పంచమం నందు, లాభము నందు శుభగ్రహములు వున్న స్త్రీ గర్భవతి అని చెప్పవచ్చు

ప్రశ్నా లగ్నం లో బుధుడు వుంటే స్త్రీ గర్భనతి అగును

రవి, చంద్ర, కుజ, శుక్ర, వారి స్వ నవాంశలలో వుంటే స్త్రీ గర్భవతి అని చెప్పవచ్చు

లగ్నాధి పతి మరియు చంద్రుడు పంచమం లో వుంటే స్త్రీ గర్భవతి అని చెప్పవచ్చు

పంచమాధిపతి శీర్షోదయ రాశులలో వున్నచో గర్భవతి అని చెప్పవచ్చు

శుక్రుడు లగ్నాలలో చూస్తున్న, పంచమంలో వున్న లేక చూస్తున్న గర్భవతి అని చెప్పవచ్చు

లగ్నము నందు కాని, ఆరూఢ లగ్నము నందు కాని ఛత్ర రాశిలో కాని రాహు వున్నచో గర్భవతి అని చెప్పవచ్చు

## గర్భవతులు కాని యోగాలుః

లగ్నాధిపతి కాని, చంద్రుడు కాని అపోక్లిమాలలో వుండి (3, 6, 9, 12) లగ్నంతో కాని, పంచమంతో కాని ఇతశాల యోగం ఏర్పడితే గర్భం రాదని చెప్పవచ్చును

పంచమాధిపతి స్థిర నవాంశలలో వున్నచో గర్భం రాదని చెప్పవచ్చు

## లింగభేదం ః

శని ప్రశ్నా చక్రంలో బేసి భావములలో వుంటే మగ సంతానమని, సరి భావములలో వుంటే ఆడ సంతానమని చెప్ప వచ్చు

**Exceptions:**

శని లగ్న భావంలో వుంటే స్త్రీ సంతానము

పంచమాధిపతి పురుష నక్షత్రాలలో వుంటే మగ సంతానమని, స్త్రీ నక్షత్రాలలో వుంటే ఆడ సంతానమని చెప్పవచ్చును

అశ్విని నుండి మృగశిర వరకు, మూల నుండి రేవతి వరకు పురుష నక్షత్రాలు

ఆరుద్ర నుండి స్వాతి వరకు స్త్రీ నక్షత్రాలు

విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ నపుంసక నక్షత్రాలు

పంచమాధి పతి వున్న నక్షత్రాధిపతి పురుష గ్రహమైతే మగ సంతానం, స్త్రీ గ్రహమైతే ఆడ సంతానం

ప్రశ్నా చక్రంలో పంచమ భావం నందు చంద్రుడు వున్న ఎక్కువ ఆడసంతానం

పంచమంలో గురుడు ఉచ్ఛలో వున్న ఎక్కువ ఆడ సంతానం

ప్రశ్నా చక్రంలో లగ్నేశునికి, కార్యేషునికి (పంచమాధిపతికి) సత్ సంబంధముంటే లేదా ఇతశాల యోగం వుంటే ఆ సంవత్సరంలో సంతానయోగం

**కవలలు:**

ప్రశ్నా లగ్నం ద్విస్వాభావ రాశి అయి శుభ గ్రహాలతో కూడి వున్న కవలలు కలుగుదురని చెప్పవచ్చును

చంద్రుడు, కుజుడు, శుక్రుడు ద్విస్వభావ రాశులలో కాని ద్విస్వభావ నవాంశలలో కాని వుండి బుధుని చేత చూడబడుచున్న కవలలు కలుగుదురు

ఈ మూడు గ్రహాలు బేసి ద్విస్వభావ రాశులలో వుండి బుధుని చే చూడబడుచున్న మగ కవలలు, సరి ద్విస్వభావ రాశులలో వుండి బుధునిచే చూడబడుతున్న ఆడ కవలలును 1 సరి, 1 బేసి, ద్విస్వభావ రాశులలో వుండి బుధునిచేత చూడబడుతున్న 1 మగ, 1 ఆడ కవలలు కలుగుదురు

**సంతానసంఖ్య:**

ప్రశ్నా చక్రంలో పంచమ భావము ఎన్ని బలమైన పురుష గ్రహాలు చూస్తాయో అంతమంది మగ సంతానం, ఎన్ని బలమైన స్త్రీ గ్రహాలు చూస్తాయో అంతమంది స్త్రీ సంతానమని చెప్పవచ్చును

ప్రశ్న చక్రంలో పంచమాధిపతి తాను వున్న చోటు నుండి ఎన్ని నవాంశలు దాటాడో అంతమంది సంతానమని చెప్పవచ్చును

## Problems during pregnancy:

మొదటి నెల - శుక్రుడు, రెండవ నెల - కుజుడు, మూడవ నెల - గురుడు, నాల్గవ నెల - రవి, ఐదవ నెల - చంద్రుడు, ఆరవ నెల - శని, ఏడవ నెల - బుధుడు, ఎనిమిదవ నెల - జన్మలగ్నాధిపతి, తొమ్మిదవ నెల - చంద్రుడు

## గర్భస్రావం :

సంతానప్రశ్నా చక్రంలో అష్టమంలో కుజుడున్న గర్భస్రావం అని చెప్పవచ్చు

కుజుడు శనిలో కాని, రాహువుతో కాని కలసి లగ్నంలో కాని, పంచమంలో కాని వున్న జనన సమయంలో కష్టములు. ఈ యోగానికి గురుదృష్టి వున్న ప్రసవం లో కష్టము జరిగినా / వచ్చినా నష్టములు జరుగవు

ప్రశ్నా చక్రంలో కుజ శుక్రులకు పరస్పర దృష్టి వున్నా లేక యుతి వున్నా గర్భస్రావం జరుగును

కుజుడు తన 4వ దృష్టితో గురుని చూచుచున్న మరల మరల గర్భస్రావం జరుగును

ప్రశ్నా చక్రంలో కుజునికి పంచంమంలో కాని, పంచమాధిపతితో కాని గురునితో కాని గురుని నుంచి పంచమంతో కాని సంబంధమున్నా శస్త్రచికిత్స జరుగును

0 0 0

## ఉద్యోగప్రశ్న:

లగ్నాధిపతికి, దశమాధిపతికి ప్రశ్నాచక్రంలో సత్యబంధం వుంటే ఉద్యోగం ఖాయంగా వస్తుంది. ఫలితం అనుకూలం

లగ్నాధిపతికి, దశమాధిపతికి రవితో సంబంధం వుంటే ఉద్యోగం ఖాయం

రవి, కుజ, గురులను రాజగ్రహాలు అంటారు. ఈ రాజ గ్రహాలకి దశమం తో సంబంధం వుంటే ప్రభుత్వ ఉద్యోగం వస్తుంది

చంద్రుడు కాని, లగ్నాధిపతి కాని 9, 10, 11 భావములతో లేక భావాధిపతులతో సంబంధం కలిగి వుంటే త్వరలో ఉద్యోగం అని చెప్పవచ్చు

లగ్నాధిపతి 3, 10, 11 అధిపతులతో సంబంధం కలిగి వుంటే వ్రాత పరీక్షలో ఉత్తీర్ణత, లగ్నాధిపతి 2, 10, 11 అధిపతులతో సంబంధం కలిగి వుంటే ఇంటర్వ్యూలో ఉత్తీర్ణత

కేంద్రములలోని బలమైన గ్రహం ఏ దిక్కును సూచిస్తుందో ఆ దిక్కున ఉద్యోగం దొరకునని చెప్పవలెను

**దిక్బలములుః**

గురు బుధులు - లగ్నంలో

శని - సప్తమం లో

రవి కుజులు - దశమం లో

చంద్ర శుక్రులు - చతుర్థం లో దిక్ బలము కలిగి వుందురు

కేంద్రాలలో గ్రహాలు లేకపోతే ప్రశ్నాలగ్నం ఏ రాశి అయినదో ఆ రాశి సూచించే దిక్కు ఉద్యోగం వచ్చే దిక్కని చెప్పవచ్చు

లగ్న దశమాధిపతులు కలసి లగ్నంలో కాని దశమం లో కాని వుంటే ఉన్న చోటునే ఉద్యోగం దొరకును. అలా కాక లగ్న, దశమాధిపతులు 12 వ భావంలో వున్న, 12 వ భావాధిపతితో కలసి ఉన్నా ఉద్యోగం దూరదేశంలో దొరకును

లగ్నాధిపతి, దశమాధిపతులకు తృతీయాధిపతితో సంబంధం వున్న దగ్గర ప్రదేశం లో ఉద్యోగం దొరకునని, 9 వ భావాధిపతితో కలసిన దూర ప్రదేశంలో ఉద్యోగం దొరకునని చెప్పవచ్చు

లగ్నాధిపతికి, దశమాధిపతికి 6, 8, 12 భావాధిపతులలో సంబంధం వున్న ఉద్యోగరీత్యా కష్టాలు, భాదలు

ప్రశ్నా చక్రంలో దశమాధిపతి అస్తంగతుడైన, నీచపడిన, పాప గ్రహములలో కూడి వున్న ఉద్యోగం దొరకదని చెప్పవచ్చు

లగ్నాధిపతి, దశమాధిపతి, వక్ర గ్రహముతో కలసి నాల్గవ ఇంటవున్న ఉద్యోగం పోవును

దశమాధిపతి తన నీచ రాశ్యాధిపతితో సంబంధం కలిగి వుంటే ఉద్యోగం లో సస్పెన్షన్

**ఉద్యోగం లో పదవోన్నతి( promotion) :**

లగ్నాధిపతి, దశమాధిపతి, చంద్రుడు చరరాశులలో వున్న తొందరగా పదవోన్నతి లభించును. స్థిరరాశులలో వున్నచో పదవోన్నతి వుండదు. ద్విస్వభావ రాశులలో వుంటే పదవోన్నతి ఆలస్యం

అగును

నాల్గవ ఇల్లు పాపగ్రహములచే ప్రభావితం అయిన ఇంటి మార్పుతో పదవోన్నతి

లగ్నాధిపతికి, మూడవఇంట అధిపతితో సంబంధం వుంటే దగ్గరి ప్రయాణం తో ట్రాన్స్ ఫర్

లగ్నాధిపతికి 9 వ ఇంటి అధిపతితో సంబంధం వుంటే దూర ప్రయాణం తో ట్రాన్స్ ఫర్

దశమాధిపతి బలంగా వున్నా లేక ఉచ్ఛలో వున్న ట్రాన్స్ఫర్ కి సంబంధించిన యోగం వుంటే పదవోన్నతితో కూడిన ట్రాన్స్ ఫర్

లగ్న, దశమాధిపతులు కలసి లగ్నంలో కాని, దశమం లో కాని వున్నచో మరియు ట్రాన్స్ ఫర్ యోగం వున్నచో వున్న వూళ్ళోనే ట్రాన్స్ ఫర్

వక్రించిన లగ్నాధిపతి తృతీయాధిపతితో కాని భాగ్యాధిపతితో కాని కలసివున్న ఉద్యోగంలో మార్పు అని చెప్పవచ్చు.

0 0 0

<u>ఆరోగ్యప్రశ్న:</u>

ప్రశ్నా చక్రంలో లగ్నం డాక్టర్ని, చతుర్థం చికిత్సని, సప్తమం రోగ నిర్ధారణను, దశమం రోగిని తెలియపరుస్తుంది.

ప్రశ్నాచక్రంలో లగ్నం బలహీనంగా వుంటే వైద్యుని లోపంగా చెప్పవచ్చును. చతుర్థం బలహీనంగా వుంటే చికిత్స లోపమని చెప్పాలి. సప్తమం బలహీనంగా వుంటే రోగనిర్ధారణలో లోపం. దశమం బలహీనంగా వుంటే రోగి సహకారం సరిగా లేదు.

అష్టమం, అష్టమాధిపతి, అష్టమంలో వున్న గ్రహం, అష్టమాని చూస్తున్న గ్రహం - శారీరక అనారోగ్యాన్ని సూచిస్తాయి

పంచమం, పంచమాధిపతుల సంబంధం మానసిక అనారోగ్యాన్ని సూచిస్తుంది

లగ్నం - తల                ద్వితీయం - ముఖం
తృతీయం - భుజాలు, చేతులు, ఇ.ఎన్.టి
చతుర్థం - ఊపిరితిత్తులు, జీర్ణవ్యవస్థ పైభాగం
పంచమం - గుండె, వీపు, వెన్నెముక, రక్తం
షష్ఠము - జీర్ణావయవ భాగాల క్రింది భాగం
సప్తమం - పొత్తికడుపు, మూత్రపిండాలు
అష్టమం - జనేంద్రియాలు                నవము - తొడలు
దశమం - మోకాళ్ళు                ఏకాదశం - పిక్కలు, మడమలు
ద్వాదశం - పాదాలు, ఎడమకన్ను

ఏదైనా ఒక పాపగ్రహం ఒక భావాన్ని సంబంధ త్రయంలో ప్రభావం చేస్తే ఆ భావానికి సంబంధించిన శరీరాగం రోగగ్రస్తమవుతుంది

పాపగ్రస్తమైన లగ్నాధిపతి కాని, చంద్రుడు కాని, షష్టాధిపతి కాని ఏ భావంలో వున్నారో ఆ భావానికి సంబంధించిన రోగం సూచింపబడును

0 0 0

**ద్రేఖాణము (D3):**

ప్రశ్నాలగ్నం ఏ ద్రేఖాణం లో వున్నదో ఆ ద్రేఖాణము సంబంధిత శరీరభాగంలో అనారోగ్యమని చెప్పవచ్చును

మెదటి ద్రేఖాణము మెడవరకు, రెండవ ద్రేఖాణము మెడనుంచి నడుము వరకు, మూడవ ద్రేఖాణము నడుము నుంచి క్రింది భాగం సూచించును.

కేంద్రాలు, కోణాలు మరియు అష్టమ భావంలో శుభ గ్రహాలుండాలి. చంద్రుడు ఉపచయభావాలలో (3, 6, 10, 11) ఉండాలి. లగ్నానికి శుభగ్రహ సంబంధముండాలి. అట్లా ఉంటే రోగం తొందరగా నివారణ అవుతుంది.

నాల్గవ భావంలో శుభ గ్రహాలున్న చికిత్స సరిగా జరుగుతుంది

ప్రశ్నాచక్రంలో లగ్న, సప్తమభావాలకి, చతుర్థానికి, దశమానికి సరి అయిన సంబంధముండాలి

**వక్రగ్రహములుః రాహుకేతువుల ప్రభావం ః**

ప్రశ్నాచక్రంలో లగ్నమందు వక్ర గ్రహము కాని, రాహుకేతువులు గాని వుంటే వైద్యుని మార్పుని సూచిస్తుంది

ప్రశ్నాచక్రంలో 4, 7 వ భావంలో కాని, వక్ర గ్రహముంటే రోగం మరల మరల వస్తుంది

కర్కాటకంలో వక్రగ్రహముంటే మందుల వాడకం లోపం మూలంగా రోగము మరల వచ్చును

రాహుకేతువులుః లగ్నంలట లాహువున్నచో రోగనివారణ జరుగదు.

కేతువునకు 6,8 భావాలకు కాని వాటి భావాధిపతులకు కాని సంబంధమున్న రోగ నిర్ధారణ కష్టమగును.

చంద్రుడుః చంద్రుడు ఉపచయభావాలలో వున్న, కర్కాటకంలో కాని, వృషభంలో కాని వున్నా, శుభకర్తరీ యోగంలో వున్నా రోగము త్వరగా నయమగును

చంద్రుడు 4 వ ఇంటిలో కాని, 8 వ ఇంటిలో కాని పాప కర్తరీ యోగంలో కాని వున్నచో రోగము త్వరగా నయం కాదు.

6, 8 భావాలుః లగ్నాధిపతి 6 వ ఇంట వున్నా, 6 వ ఇంటి అధిపతి లగ్నంలో వున్న రోగము త్వరగా నయం కాదు.

షష్టాధిపతి అష్టమాధిపతి ఇరువురు లగ్నంలో వుంటే రోగి కి మరణభయం ఖాయమని చెప్పవచ్చు

లగ్నాధిపతికి, అష్టమాధిపతికి ఇతపాల యోగం వున్నచో రోగికి మృత్యుభయం

**పరివర్తనయోగం** : ఆరవ భావాధిపతి ఎనిమిదవ భావాధిపతి పరివర్తన కలిగి వుంటే త్వరిత గతిన ఉపశమనం

**రోగకాలం :**

లగ్న, షష్టాధిపతుల చర రాశులలో వున్న రోగం త్వరలో నయమగును. స్థిర రాశులలో వున్న ఎక్కువ కాలం పట్టును. ద్విస్వభావ రాశులలో వుంటే మధ్యస్తంగా వుంటుంది.

లగ్నాధిపతికి, దశమాధిపతికి శత్రుత్వం ఉండరాదు. చతుర్థ, సప్తమాధిపతులకు శత్రుత్వం ఉండరాదు.

లగ్నాధిపతికి షష్టాధిపతికి ఏ విధమైన సంబంధం వున్న రోగం తగ్గదు

లగ్నాధిపతికి, అష్టమాధిపతికి కుజ సంబంధం వుంటే శస్త్ర చికిత్స తర్వాత మరణం సంభవించే అవకాశం వున్నది

చంద్రుడు గాని, శుక్రుడు గాని లగ్నంలో వున్న (స్వస్థానములు కాక) రోగము తగ్గదు

లగ్నాధిపతి కాని, చంద్రుడు కాని బలహీనంగా వున్న రోగము త్వరగా నయం కాదు.

**నిధి ప్రశ్న:**

ప్రశ్నా చక్రంలో ద్వితీయ భావం శుక్ర క్షేత్రం కాని, చంద్ర క్షేత్రం కాని అయ్యి దానిలో శుక్రుడు, చంద్రుడు (స్వ క్షేత్రం) ఉంటే ఆ భూమిలో నిధి వున్నట్లు.

ప్రశ్నా చక్రంలో అష్టమం బలంగా వుంటే భూమిలో నిధి వున్నట్లు

ప్రశ్నా లగ్నం మేషమయి, చతుర్థంలో గురు, చంద్రులుంటే నిధి వున్నట్లు

రెండవ భావానికి, లాభ భావనికి శుభగ్రహ దృష్టి వుంటే నిధి దక్కుతుంది. పాప గ్రహ దృష్టి వుంటే నిధి దక్కదు

**భూ లాభ ప్రశ్న:**

స్థిరాస్తి - చతుర్థభావం
భూకారకుడు - కుజుడు
11 వ భావం - లాభం
9 వ భావం - అదృష్టం

కుజునకు 4 లేక 9 భావాలతో సంబంధం వుంటే భూ ప్రాప్తి.

కుజునకు 11 వ ఇంటితో సంబంధం వుంటే భూమి మూలంగా లాభం కలుగుతుంది

0 0 0

## నివాసగృహప్రశ్న :

సుఖానికి కారకుడు గురుడు. ప్రశ్నాచక్రంలో 4, 9 భావాలు గురుడు, బలంగా ఉంటే గృహసౌఖ్యం లభిస్తుంది

## అభిచార ప్రశ్న:

6 వ ఇంటిలో నీచ గ్రహమున్న 6 వ ఇంటిని శత్రుగ్రహం చూస్తున్న లగ్నాధిపతి 6 వ ఇంటి అధిపతి, రాహువు కలసి వ్యయంలో వున్న దృష్టిదోష సంబంధ బాధలు కలుగును.

## ఆకస్మిక ధన లాభం :

అష్టమంలో శుభ గ్రహాలు, ఆకస్మిక ధనలాభం సూచిస్తాయి. పంచమం, ద్వితీయం, లాభం ఈ భావాధిపతులకు సంబంధం వుండి బలం కలిగి వుంటే పందాలు, జూదాలు, లాటరీల ద్వారా ఆకస్మిక ధనలాభం

ప్రశ్నాచక్రంలో చంద్ర, రాహువులు పంచమంలో వుంటే ఆకస్మిక ధనలాభం

2, 9, 11 భావాధిపతులకు ( ఏ ఇద్దరికైనా ) సంబంధం వుంటే ధనయోగం

## వ్యాపారప్రశ్న:

వ్యాపారానికి కారకుడు బుధుడు. 10 వ భావం కృషి, 11 లాభం, 12 వ్యయం, లగ్నం నష్టాన్ని తట్టుకునే శక్తి. SAV లో 10 కంటే 11 ఎక్కువ, 11 కంటే 12 తక్కువ , 12 కంటే 1 ఎక్కువ బిందువులుండాలి

భాగస్వాముల లగ్నం ప్రశ్నించే వాడు సప్తమం భాగస్వామ్యం. లగ్నాధిపతి, సప్తమాధిపతులు ఒకరినొకరు శుభస్థానాల్లో వుండాలి.

బుధుడు బలంగా వుండాలి. లాభం బాగుండాలి. ఏ వస్తువులతో అయితే వ్యాపారం చేస్తున్నాడో ఆ వస్తువులకి సంబంధించిన గ్రహం బాగుండాలి.

## వర్షప్రశ్న:

శుక్రచంద్రులు జలతత్త్వ గ్రహాలు, కర్కాటక, వృశ్చిక, మీనాల జలతత్త్వ రాశులు

శుక్రచంద్రులలో ఏ ఒక్కరైన కేంద్రంలో వుండి ఆ కేంద్రం జలతత్త్వరాశి అయితే అది వర్షయోగం. అలా వున్న శుక్రుని లేక చంద్రుని శుభగ్రహాలు చూస్తే చక్కటి వర్షం కురుస్తుంది. పాప గ్రహాలు చూస్తే స్వల్ప వర్షం కురుస్తుంది. శుభ, పాప గ్రహాలు రెండూ చూస్తే మధ్యమం

శని ఉన్నరాశి నుంచి 5, 7, 9 స్థానాల్లో చంద్రుడుంటే వర్షం కురుస్తుంది

శుక్రుడు, బుధుడు, గురుడు, ఈ 3 గ్రహాలలో ఏ రెండు గ్రహాల యుతి జరిగినా వర్షం పడుతుంది

కుజ, శనుల యుతి వర్షాన్ని ఇవ్వరు.

0 0 0

**చోరప్రశ్న:**

చోరప్రశ్న లగ్నం పృశ్చకుని, చతుర్థం పోయిన ఆస్తి, సప్తమం దొంగ, దశమ భావం పోలీస్ ను సూచించును.

**దొంగఎవరు?**

చరరాశి లగ్నమైతే బయటివ్యక్తి దొంగ

స్థిర రాశి లగ్నమైతే, నవాంశలగ్నమైనా ఇంట్లో వ్యక్తి దొంగ

ద్విస్వభావ రాశి లగ్నమైతే, ఇంటికి తరచుగా వచ్చే వ్యక్తి దొంగ

రవి చంద్రులిరువురు లగ్నాన్ని చూస్తుంటే కుటుంబ సభ్యుడే దొంగ

రవి చంద్రులిద్దరిలో ఎవరైనా లగ్నాన్ని చూస్తు ఉంటే ఇంటి పరిసరాల్లో ఉండే వ్యక్తి దొంగ

లగ్న సప్తమాధిపతి కలసి లగ్నంలో వుంటే కుటుంబ సభ్యుడే దొంగ

ప్రశ్నా చక్రంలో శని గురుని చూస్తూ వుంటే ఆ దొంగ చాలా ప్రమాదకరమైన వ్యక్తి

చంద్ర శుక్రులిద్దరు సప్తమంలో వున్నా, సప్తమాన్ని చూస్తున్న ఈ దొంగతనాన్ని మొదటిసారిగా చేస్తున్నాడని చెప్పవచ్చును

**దొంగ వయస్సు:**

సప్తమాధిపతి రవి అయితే వయసు మీరినవాడు

సప్తమాధిపతి చంద్రుడయితే యువకుడు, తెలివి కలవాడు

సప్తమాధిపతి కుజుడయితే యువకుడు లేక సోదరుడు

సప్తమాధిపతి బుధుడయితే స్నేహితుడు, యువకుడు

సప్తమాధిపతి గురుడయితే మధ్యవయస్కుడు

సప్తమాధిపతి శుక్రుడయితే స్త్రీ దొంగ అని చెప్పవచ్చు

సప్తమాధిపతి శని అయితే ఇంట్లో పనిచేసేవాడు, వయసుమళ్ళిన వాడు ముసలిగా కనిపించేవాడు

**దొంగ వుండే ప్రదేశం ః**

సప్తమాధిపతి కేంద్రాలలో వుంటే దొంగ ఆ ప్రదేశంలో వున్నట్లు

సప్తమాధిపతి 3 లేక 9 భావాలలో వుంటే ఆ వూరు వదలిపెట్టి వెళ్ళిపోయుంటాడు

**దొంగ ధరించిన దుస్తుల రంగుః**

సప్తమాధిపతి ఏ రంగును సూచించునో ఆ దొంగ ఆ రంగు దుస్తులను ధరిస్తాడు

రవి - కాషాయం చంద్రుడు - తెలుపు, కొత్తబట్టలు

కుజుడు - ఎరుపు రంగు , కాలిన మచ్చలు

బుధుడు - ఆకుపచ్చ రంగు, ఉతకని బట్టలు

గురుడు - పసుపు రంగు, శుభ్రమైన బట్టలు

శుక్రుడు - ఆకర్షణీయమైన బట్టాలు

శని - నల్లని, చిరిగిన వస్త్రాలు, ముదురు నీలం రంగు

దొంగ మగా? ఆడా? ః

రవి, కుజ, గురు - పురుష గ్రహాలు

చంద్ర, శుక్ర, రాహువులు - స్త్రీ గ్రహాలు

దిక్కుః

ప్రశ్నా చక్రంలో కేంద్రాలలోవున్న బలమైన గ్రహం పోయిన వస్తువు ఏ దిక్కు కలదో సూచిస్తుంది

కేంద్రాలలో గ్రహములు లేని పరిస్థితులలో లగ్నము ఏ రాశి అయినదో ఆ రాశి సూచించే దిక్కున పోయిన వస్తువు లభిస్తుంది.

**పోయిన వస్తువు దొరుకుతుందా? దొరకదా? ః**

| | | | |
|---|---|---|---|
| రోహిణి | మృగశిర | ఆర్ద్ర | పునర్వసు |
| పుష్యమి | ఆశ్లేష | మఖ | పుబ్బ |
| ఉత్తర | హస్త | చిత్త | స్వాతి |
| విశాఖ | అనురాధ | జ్యోష్ఠ | మూల |
| పూ.ఆషాఢ | ఉ.ఆషాఢ | అభిజిత్ | శ్రవణం |
| ధనిష్ట | శతభిషం | పూ.భాద్ర | ఉ.భాద్ర |
| రేవతి | అశ్విని భరణి | కృత్తిక | |
| అంధ | ముద | మధ్య సులోచన | |
| 15రోజులు | 30 రోజులు | 60రోజులు | |
| తూర్పు | దక్షిణ | పశ్చిమదిశలను సూచిస్తుంది | |

ద్వితీయాధిపతి ద్వితీయంలో గాని చతుర్థంలో గాని వుంటే పోయిన వస్తువు లభిస్తుంది. చతుర్థంలో పాపులుంటే వస్తువు లభించదు

లగ్న, దశమాధిపతులకు సంబంధముంటే పోలీసు ద్వారా వస్తువు దొరకుతుంది.

దశమలలో పాప గ్రహముంటే పోలీసుల సహకారముండదు

అష్టమాధిపతికి, దశమాధిపతికి సంబంధముంటే పోలీసులవలన దొంగకు లాభం

అష్టమాధిపతి లగ్నంలో వుంటే దొంగ యొక్క సొమ్ము మనకు లభించును. దొంగ తానే స్వయంగా వచ్చి వస్తువును తిరిగి ఇస్తాడు

చతుర్థాధిపతికి, లాభాధిపతికి, ద్వితీయాధిపతికి, భాగ్యాధిపతికి సంబంధముంటే పోయిన వస్తువు తిరిగి లభిస్తుంది

చంద్రుడు కాని, గురుడు కాని కేంద్ర భావాలు లేక అష్టమభావాలకి అధిపతులయితే పోయిన వస్తువు లభిస్తుంది

<u>వస్తువు లభించని యోగాలుః</u>

కుజుడు సప్తమంలో కాని, అష్టమంలో గాని వుంటే వస్తువు చేతులు మారినది

లగ్న సప్తమాధిపతులకు పరివర్తన వుంటే పోయిన వస్తువు దొరకుతుంది. కాని ఆ సప్తమాధిపతి వక్రించిన వస్తువు దొరకదు

అష్టమాధిపతి సప్తమంలో వున్నా, అష్టమంలో వున్నా పోయిన వస్తువు తిరిగిరాదు

లగ్నంలో రవి, సప్తమంలో చంద్రుడు వుంటే పోయిన వస్తువు తిరిగి రాదు.

లగ్నాధిపతి లగ్నాన్ని కాని, ద్వితీయాన్ని కాని చూడనిచో దొంగ నుండి వస్తువు రాబట్టినను యజమానికి దక్కదు.

<u>ద్రేఖాణ స్వరూపం ః</u>

లగ్నం ప్రథమ ద్రేఖాణంలో వుంటే ఇంట్లోనే వస్తువు పడిపోయినది

లగ్నం రెండవ ద్రేఖాణంలో వుంటే ఇంట్లోనే పెట్టి మర్చిపోయారు

లగ్నం మూడవ ద్రేఖాణం లో వుంటే దొంగతనం జరిగింది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| రవి | - | శయ్యాగృహం | చంద్రుడు | - | జలసమీప భూమి |
| గురుడు | - | దేవతా గృహం | కుజుడు | - | అగ్ని సమీప ప్రదేశం |
| శుక్రుడు | - | అలంకరించిన గది | శని | - | మలిన ప్రదేశాలు |
| బుధుడు | - | చిత్ర గృహాలు ( ఇంట్లో ఆటలు ఆడుకునే ప్రదేశాలు) | | | |

0 0 0

## తప్పిపోయిన / పారిపోయిన వ్యక్తుల గురించి ప్రశ్నః

ప్రశ్నాచక్రంలో లగ్నం తప్పి పోయిన లేక పారిపోయిన వ్యక్తి
చతుర్థం సుఖం లేక క్షేమం
సప్తమం ప్రయాణించే మార్గాన్ని సూచిస్తాయి

చరరాశులు లగ్నమైన, నవాంశ లగ్నమైన వ్యక్తి ప్రయాణిస్తున్నాడు
స్థిర రాశి అయితే ప్రయాణం కాని తిరుగు ప్రయాణం గాని చేయడం లేదు
ద్విస్వభావ రాశి లగ్నమైనా, నవాంశ లగ్నమైనా చర రాశికి దగ్గరలో వుంటే ప్రయాణం, స్థిర రాశికి దగ్గరలో వుంటే స్థిరత్వం
కేంద్ర కోణాలలో శుభ గ్రహాలు, 3, 6, 11 లలో పాప గ్రహాలు వుండాలి
చతుర్థంలో శుభగ్రహాలుంటే క్షేమంగా ప్రయాణిస్తున్నాట్లు తెలుసుకోవాలి.

### క్షేమంగా తిరిగి వచ్చే యోగాలుః

రెండవ భావం కుటుంబ భావము, మూడవ భావం సోదర భావము, ఐదవ భావం సంతానం లేక ఆప్యాయత (ప్రేమ). ఈ భావములలో శుభగ్రహాలున్న క్షేమంగా త్వరగా ఇంటికి వస్తాడు.

ప్రశ్నా చక్రంలో 4 వ భావంలో శుభులున్న వెంటనే తిరిగి వస్తాడని చెప్పవచ్చు.

### చంద్రుడుః

చంద్రుడు కనుక చతుర్థంలో వుంటే క్షేమంగా తిరిగి వచ్చేసాడని, సప్తమంలో కనుక చంద్రుడుంటే తిరుగు ప్రయాణంలో వున్నాడని, దశమంలో కనుక చంద్రుడుంటే క్షేమంగా వున్నాడు కాని తిరుగు ప్రయణం చేయటం లేదని చెప్పాలి.

రవి శుభులు కాని లాభంలో వుంటే క్షేమంగా తిరిగి వస్తారు.

అష్టమంలో వున్నా గ్రహం ఏదైనా వక్రించి సప్తమానికి వస్తే వెళ్ళినవాడు తిరిగి వస్తాడు.

తిరిగిరాని యోగాలుః

లగ్నం చంద్రుడు లేక సప్తమం కర్తరీ యోగంలో వుంటే తిరుగు ప్రయాణం చేయటం లేదు. శుభ కర్తరీ అయితే క్షేమంగాను, పాప కర్తరీ అయితే కష్టాల్లోను వున్నట్లు

సప్తమంలో చంద్రుడుండి చంద్రుడికి రెండు వైపులా శుభగ్రహాలయితే ఇష్టపూర్వకంగా బంధు మిత్రుల కోరికతో తిరుగు ప్రయాణం నిలిపి వేయడమైనది

సప్తమంలో చంద్రుడు పాప గ్రహాల మధ్య వున్న దొంగల మూలంగా కాని, అనారోగ్య కారణం వల్ల కాని తన ఇష్టానికి వ్యతిరేకంగా తిరుగు ప్రయాణాన్ని ఆపివేశారని భావించవచ్చు

రవి గాని, శుభగ్రహాలు కాని 12వ ఇంటిలో వుంటే ప్రమాదంలో వున్నాడని తిరిగి రాడని చెప్పాలి

సప్తమంలో వక్రించి పడిపోయిన గ్రహం అష్టమంలోకి వచ్చినచో వెళ్ళిన వ్యక్తి తిరిగి రాడు

కష్టాలు:

లగ్నం పృష్ఠోదయరాశి ( 1, 2, 4, 9, 10) అయి 5, 7, 9 భావాలలో పాప గ్రహాలున్న వెళ్ళిన వ్యక్తి కష్టాలలో వున్నాడు

కుజుడు గాని, శని కాని అష్టమంలో వుంటే వెళ్ళిన వ్యక్తికి ప్రమాదం

రవి, చంద్రుడు అష్టమంలో వుండి శని చేత చూడబడుతున్న ఆయుధాల మూలంగా ప్రమాదం

అనారోగ్యము:

ప్రశ్నాచక్రంలో శని 6 వ భావాన్ని చూస్తున్న వెళ్ళిన వ్యక్తికి అనారోగ్యమని చెప్పవలెను.

ఆరింట చంద్రుడు పాప కర్తరీలో వున్న అనారోగ్యమని చెప్పవలెను.

బంధనం ( kidnapping):

4, 5, 8 లేక 9 భావాలలో శని వుండి ఆ భావాలు పాప గ్రహ రాశులయి వుండి, ఆ శని పాప గ్రహాలచే చూడబడుచున్న బంధనయోగం. ఈ పరిస్థితులలో లగ్నం చర రాశి అయితే తాత్కాలిక బంధనం. స్థిర రాశి అయితే దీర్ఘకాలిక బంధనం

అష్టమంలో పాప గ్రహాలున్న, అష్టమాన్ని పాపగ్రహాలు చూస్తున్న, వెళ్ళిన వ్యక్తి చిత్రవధని అనుభవిస్తున్నాడు అని చెప్పవలెను.

మరణం :

అష్టమాధిపతి లగ్నాధిపతి కంటె బలవంతుడయిన ప్రయాణికునికి మరణం అని చెప్పవచ్చు

ప్రష్ఠోదయరాశి లగ్నమై, పాప గ్రహముల చేత మాత్రమే చూడబడుచూ, 6, 8 భావములలో పాప గ్రహాలున్న మరణమని చెప్పవలెను

అష్టమంలో శని వుండి పాప గ్రహ సంబంధం కల్గివున్న మరణమని చెప్పాలి

## తిరిగివచ్చు సమయం :

చతుర్థంలో శుభ గ్రహాలు వున్న త్వరగా తిరిగి వస్తాడు.

సప్తమాధిపతి వక్రించు సమయానికి వ్యక్తి తిరిగి వస్తాడు. అప్పటికే వక్రంలో వుంటే ఋజుగతిలో వచ్చు సమయానికి తిరిగి వస్తాడు

సప్తమాధిపతి రవి కాని చంద్రుడు కాని అయితే వారు వున్న నక్షత్రాధిపతులు ఎప్పుడు వక్రించడం మొదలు పెడతారో అప్పుడు తిరిగి వస్తారు

సప్తమాధిపతి గోచారరీత్యా లగ్నాన్ని చేరుకున్నప్పుడు ఆ వ్యక్తి తిరిగి వస్తాడు

ప్రశ్నా చక్రంలో చంద్రుడు చతుర్థ భావానికి దగ్గరలో వున్నప్పుడు చతుర్థంలోకి వచ్చిన సమయానికి ఆ వ్యక్తి తిరిగి వస్తాడు

0 0 0

## నష్టజాతక ప్రశ్న:

జాతక చక్రం లేని వారికి ప్రశ్న ద్వారా జనన సమయాన్ని, జాతక చక్రాన్ని తెలుసుకోవడం నష్టజాతక ప్రశ్న ముఖ్యోద్దేశం

## సంవత్సర జ్ఞానం :

మొదట ప్రశ్నా చక్రాన్ని డిగ్రీలతో సహా నిర్మించాలి. ఈ ప్రశ్నాచక్రానికి హోరా, ద్రేఖాణ, నవాంశ, ద్వాదశాంశ చక్రాలను నిర్మించాలి

ద్వాదశాంశ చక్రంలో చంద్రుడు ఎక్కడ వున్నాడో ఆ రాశి జన్మ చక్రంలో గురుడు వున్నరాశి సమానమగును

వ్యక్తి యొక్క సుమారు వయస్సును బట్టి, గురుడు వున్న రాశినిబట్టి సంవత్సరాన్ని కనుక్కోవాలి

## అయనజ్ఞానం :

ప్రశ్నాచక్రంలో లగ్నం మొదటి హోరలో ( 15 డిగ్రీలలోపల) ఉంటే ఉత్తరాయణమని, రెండవ హోరలో వుంటే దక్షిణాయనమని తెలుసుకోవాలి

దీన్ని బట్టి ఉత్తరాయణ సమయంలో రవి మకరం నుండి మిధునం వున్న రాశులలోను, దక్షిణాయణంలో రవి కర్కాటకం నుండి ధనస్సు వున్న రాశులలోను వున్నట్లు తెలుసుకోవాలి

**ఋతుజ్ఞానం :**

ప్రశ్నాచక్రం యొక్క లగ్నం ఏ ద్రేఖాణంలో వున్నదో ఆ ద్రేఖాణాధిపతి ఋతువును సూచిస్తాడు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| రవి | - | గ్రీష్మం | చంద్రుడు | - | వర్ష |
| కుజుడు | - | గ్రీష్మ | గురుడు | - | హేమంత |
| శుక్రుడు | .. | వసంత | శని | - | శిశిర |
| బుధుడు | - | శరదృతువు | | | |

**మాసజ్ఞానం :**

ప్రశ్నచక్రంలో లగ్నం ద్రేఖాణం లో ఏ సగంలో వున్నదో ఋతువులో ఆ నెలగా తీసుకొనవలెను

ఉదా: లగ్నం 140 డిగ్రీలలో వుంటే రెండవ ద్రేఖాణంలో మొదటి సగంలో వుంది. అనగా వసంత ఋతువులో చైత్రమాసంలో వుంది

**తిథిజ్ఞానం :**

ఒక రాశిలో 30 డిగ్రీలు, నెలలో 30 తిథులు కలవు. రవి ఒక రాశిని పూర్తిగా సంచరించుటకు 30 రోజులు పట్టును. ప్రశ్నా చక్రంలో రవి స్ఫుటము, తిథికి సమానము.

ఉదా: రవి 6 డిగ్రీల 30 ని॥లలో వుంటే తిథి శుద్ధ సప్తమి

రవి 26 డిగ్రీల 30 ని॥లలో వుంటే తిథి బహుళ ద్వాదశి

**దివారాత్రి జ్ఞానం :**

సింహము, కన్య, తుల, వృశ్చిక, కుంభ, మీనాలు దివా బలం కల రాశులు.

మేషం, వృషభం, మిధునం, కర్కాటకం, ధనస్సు, మకరం రాత్రి బలం కల రాశులు.

దివా బలం గల రాశులలో ప్రశ్నా లగ్నమైతే రాత్రి జన్మించినట్లు.

రాత్రి బలం కల రాశులు అయితే పగటి పూట జన్మించినట్లు

**సమయజ్ఞానం :**

రాశిలోని 30 డిగ్రీలు 30 ఘడియలకు సమానం. ప్రశ్నాచక్రంలో లగ్నం ఎన్ని డిగ్రీలలో వున్నదో జననం అన్ని ఘడియల తర్వాత జరిగినట్లు

ఉదా: లగ్నం 16 1/2 డిగ్రీలలో వున్న జననం 16 1/2 ఘడియలగును. అనగా పగటి జననమైనా సూర్యోదయం తర్వాత 16 1/2 ఘడియలకు జననమని గుర్తించాలి

పై విధముగా నష్ట జాతక పద్ధతి ప్రకారం జన్మ జాతక చక్రం వేయుటకు ఉపాసన బలం, ఊహా శక్తి ఎంతో అవసరం.

శ్రీమాత్రే నమః